# : కృతి :

ప్రభవమందినదాది గారవము మీఱఁ
బెంచి, కవితను నాకునేర్పిన పవిత్ర
కన్నయాచార్య గురుపాద కంజములకు
నంకిత మొనర్తు నీపొత్త మమితభక్తి.

లోకములోన నే పురములోనను లేని వినూత్నవృత్తిఁ దా
నైకొని, యెట్టివారలు దగా పడకుండ సువర్ణ భూషలన్
దూకము వైచి, వన్నెచుగనుంగొని, మూల్యము నిర్ణయించి "యు
ల్లాకు"ను వ్రాసి యిచ్చు యకలంక చరిత్రునకిత్తు నీ కృతిన్.

కృష్ణప్రతిజ్ఞాది కృతు లనేకము వ్రాసి
వాసిఁ గాంచిన లసత్ పండితుండు;
నవరత్నముల సుగుణముల దుర్గుణముల
శోధించిచెప్పు, మేధాధనుండు;
జాతక ఫలము లాశ్చర్యమందగఁ దెల్పు
జ్యోతిష శాస్త్ర విఖ్యాత పురుషుఁ;
డున్నతాంచిత మహోద్యోగులచే, యోగ్య
తా పత్రములఁగొన్న ధన్యమూర్తి;

ఉరు సుపర్ణసమాని గోత్రోద్భవుండు;
సరస సన్నుతు కన్నయాచార్యవరుఁడు;
నా పితామహుఁ డీ కృతినాథుఁ డగుట
కంటె భాగ్యంబు వేరొండు కలదె నాకు ?

రచయిత.

# అభిప్రాయము

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ కవిసార్వభౌమాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారొసంగిన యమూల్యాభిప్రాయము :—

ఇది శ్రీ వేంకట వీరరాజకవులలో నొకరగు బ్రహ్మశ్రీ సున్నం వీరరాజకవి గారిచే రచింపఁబడినది. కాళిదాస గ్రథిత మేఘసందేశ గ్రంథభాగ శేషాంశముల సేకరించి యీగ్రంథము రచింపఁబడినది ప్రవాసమందు జనునకు "నాతి కల బ్రహ్మచర్యము" ప్రధానమైన కష్టము. దానిం బురస్కరించుకొని కరుణరసముతో నిది విరాజిల్లుచున్నది. నేను గ్రంథమంతయు సావధానముగా నాకర్ణించితిని. వీరరాజుగారి కవిత్వము నాతి కఠిన మృదుమధురమై మనోహరమై యుండును. శైలి గంగాప్రవాహమువలె ధారాశుద్ధి గలిగియుండును. ఇది పాఠశాలలలోఁ బాఠ్య గ్రంథముగా నుండుటకును దగి యున్నది.

రాజమండ్రి,
26-7-46.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# తొలిపలుకు

యక్షుఁడు కుబేరుని కొలువులో నొక నౌకరు. విశ్వాస పాత్రుఁడగు సేవకుఁడగుటచే యక్షునిపైఁ గుబేరునకుఁ దయఁ గలిగి చక్కని చుక్కయగు నొకయక్షిణిఁదెచ్చి వానికి వివాహము గావించెను. సమాన రూపలావణ్యములుగల యా నవదంపతు లానంద రసాబ్ధి వీచికలలో విహరించుచుండిరి.

ఒకనాఁడు భార్య యలుగుటచే నామె యలుకనుదీర్చి యక్షుఁడు కొలువుకూటమున కేగుట యొక యరగడియ యాలస్యమగుటయు సంభవించెను. దానం గుబేరుఁడు, "ఇంత కామాంధకారుఁడవైతివా" యని యక్షునిపై మండిపడుచు, "నీ భార్యను విడనాడి యేకాకివై భూలోకములోఁ జిత్రకూటపర్వతము చెంత నొక వత్సరము వసించెదవుగాక ! నీ యమరత్వము నశించుగాక !" యని వానిని శపించెను. అంత గాఢముగాఁ బ్రేమించినటువంటి పత్నీవియోగము జెందిన యక్షుని హృదయావేదనయే యిందలి కథాంశము.

శ్రీ కాళిదాస మహాకవి "మేఘ సందేశము"లో, ఎనిమిదిమాసములు గతించిన పిదప వర్షర్తు వాసన్నమగుటచేఁ బొడమిన మేఘునిఁ గాంచి :—

చ॥ కుశలమె నీకు మేఘ! యెటకుంజనివచ్చితొ? రాగదే భవా
దృశుల పవిత్రదర్శనము దీనున కబ్బుట యబ్బురంబు, దు
ర్దశను కృశించి క్రుంగితిని. తావకశీతలవారి చేత నా
కుశమనమున్ రవంతయొన కూర్పుమ కొల్చెదగొండమల్లెలన్

ఉ॥ చల్లనివాఁడవంచు విలసన్మహనీయగుణాకరుండ వం
చెల్లరు నిన్ను గూర్చి నుతియించు కతానఁ ద్వదీయ పాద సం
ఫుల్లసరోజముల్ వినయపూర్వక భక్తిని నాశ్రయింతు, నా
పల్లవపాణి చెంగటకుఁ బంపెద నేగుము, రాయబారివై.

యని యర్థించుచు వానిచే దనహృదయేశ్వరికి సందేశ మంపించెను.

ఈ యెనిమిదిమాసములోగా శ్రీ కాళిదాసమహాకవి పైగ్రంథమున—

తస్మిన్నద్రౌ కతిచి దబలా విప్రయుక్తస్స కామీ
నీత్వా మాసా న్కనకవలయభ్రంశరిక్త ప్రకోష్ఠః
ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్ట సానుం
వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ.

అను శ్లోకమును వ్రాసి, భార్యావియోగ దుఃఖమున యక్షుఁడెంతగా చిక్కి శల్యావశిష్టుఁడైనాఁడో మనమూహించుకొనుట కవకాశము గలిగించెను. ఆ యవకాశమును బురస్కరించుకొనియే, యక్షుఁ డీయెనిమిదిమాసములలోగా నెంత బాధపడినాఁడో యూహించుచు నా స్వంతభావములతో నే నీ చిఱుకావ్యమును రచించితిని. నా ప్రయత్న మెంతవఱకు ఫలించినదో నిర్ణయించుభారము కవిలోకముపై నున్నది.

మదరాసులోనున్న శ్రీ తెలుఁగుభాషాసమితి కార్యదర్శిగారికి 31-8-48 నాటికిఁ గవులు తమకావ్యములను బంపించవలసియుండుటచే నడావుడిగా నే నీపొత్తమును రెండు దినములలోనే యచ్చొత్తింపవలసి వచ్చుటవలన యచ్చుటచ్చుటఁ గొన్నితప్పు లుండియుండవచ్చును. వానిని సవరించుకొని చదువ సహృదయులఁ బ్రార్థింతును.

ఈ "యతిప్రవాసము"ను సావధానముగా నాకర్ణించి తమ సదభిప్రాయము నొసంగిన కవిసార్వభౌములు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారికి నాహృదయపూర్వకాభివందనములు.

ఈపొత్తమును వెంటనే యచ్చొత్తించుకొనుట కవకాశముగా దమకు దామై ధనసహాయముజేసి నన్నుఁ బ్రోత్సహించిన నాప్రియమిత్రులకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

తుని,
30-8-1948.

సున్నం వీరరాజకవి.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# ప్రార్థన

శ్రీ రంజల్లెడు కండిమల్లయ పురిం జన్మప్రాప్తుడై వెల్గి, సం
సారాంభోధిం దరించి భక్తులకుం బ్రజ్ఞాశక్తిం జూపించి, ధా
త్రీ రారాజగు వారిక జీవిత సమాధింగొన్న శ్రీ పోతులూ
రీశ్వర బ్రహ్మగురున్ భజించెద, మనోభీష్టంబు సిద్ధింపగన్.

వెన్నెల పూచికాయునెడ ప్రేమ జనించి మగండు పక్కలో
నున్న యుమాసతిన్ గవయ నూహ జనించునటన్న యీర్ష్యచే
వన్నె దొలంగి జాహ్నవి ప్రవాహముగా దిగజారె యన్నెలన్
గ్రన్నన గప్పివైవఁ, జిలు గవ్వాలయం గను శంభుఁ గొల్చెదన్.

ఆనందంబున శేషపాన్పుపయి భార్యంగూడి సల్లాప సం
ద్రానం దేలుచునుండ శ్రీశుఁడు, తరంగాల్ పొంగి తత్ శేషునో
రా నెట్టంగ బిరాన నొండొరులు గాఢాశ్లేషణల్ గొన్న ల
క్ష్మీనారాయణులన్ స్మరింతు శుభముల్ చేకూర నశ్రాంతమున్.

వాణిన్, నవనీలాంబుద
వేణిన్, గమనీయ విమల విశ్రుత సుగుణ
శ్రేణిన్, విధి రాణిన్, మృదు
పాణిన్, మదిఁగొలుతు సరస వాక్ప్రణుతికై.

ఓమ్

# యక్ష ప్రవాసము



నరలోకంబున గాననాంతరములోనన్ జిత్రకూటాద్రి గ
హ్వరసామీప్యమునం దాకేండు నమరత్వంబెల్లం బోనాడి యొం
టరిగాం గుందుమటంచు శాపమొసంగెన్ గట్టా! కుబేరుండు, నా
తరమా ఘోరవియోగసాగరము నీదన్ నిస్సహాయుండనై! ౧

భూలోకంబునం బావనంబగు స్థలంబుల్ నేత్రపర్వంబుగా
నాలోకించుచు శాపము న్గడప సాధ్యంబైన నిశ్చింతగాం
గాలక్షేపము సేయంగల్గుదు, నటుల్ గాకుండ నుగ్రాటవిన్
గూలం ద్రోసెం గుబేరుం డచ్చోటన్ నే గొంతెత్తి రోదింపంగన్.

అలుకను బూని యున్న ప్రియురాలినిం గాంచుటె నాకు నెంత మో
కులు కగుటన్ సరాగమున కోమలి కోపము దీర్పగల్గి నేం
గొలువున కేంగ నింత యొనంగూడెను; తామస మాడుదానికిన్
గలుగగరాదు; కల్గునెడ కష్టపరంపర మూడి తీరెడిన్. ౩

వలదు వివాహమన్న బలవంతముగా ధనదుండు పెండిలిన్
జలిపి, రవంత కొల్వునకు జాలముగాం జన శాపమిచ్చె మా
వలపుం దలంపంబోక, ధనవంతుని కత్తికి రెండువైపులన్
గలుగును వాడియన్న నుడికారము సార్థకమయ్యె నియ్యెడన్.

నా యనువారు లేక విపినంబున నెక్కటినై వసింపఁగాఁ
జేయుట కా కుబేరునకుఁ జెల్లెను గాక! ధనేశుఁ డౌటచే;
న్యాయము నెంతు రే ధనమదాంధులు లోకములోన నన్నిటన్
హేయము దాస్యవృత్తివహియించుట యెంతటివాని కేనియున్.

చలమున ధర్మాధర్మం
బులు తలఁపక ధనదుఁ డింత ముష్కరుఁ డై ఘటించెన్
దల యమ్ముకొన్న వానికి
ఫలితం బింతకును మించి ప్రాప్తించునొకో! ౬

ఒకనాఁడేని యలక్ష్యభావమున నాజ్ఞోల్లఘనం బే నొన
ర్పకె యిన్నాళులు భక్తిశ్రద్ధలను సేవల్ సేసితం జూవహా సే
యక పౌలస్త్యుఁడు నన్ శపించె నిసుమంతాలస్యమైనందుకే,
యకటా! పూర్ణకృతఘ్నమానసులు కారా, యీధనాధీశ్వరుల్?

మంచిగఁదీపి మాటలను మాటికిఁ బల్కుచు వేళమించి చే
యించెను సేవలా ధనదుఁ డెన్నియొ సారుల్, నొక్కనాఁడు నే
నించుక జాలముం జలుప నిట్లు శపించె, నొకళ్ళ దోస మెం
చెంచెడు వాఁడు సొంతదోసగెంచఁడు కొంచె మదేమిచిత్రమో!

“అపచారంబు క్షమింపఁ గావలె, కుబేరా! యింక నేనెన్నఁ డి
ట్లపరాధం బొనరింపఁబోను, కరుణాయత్తైక చిత్తుండవై
యిపుడీనేరము సైఁప గావలయుఁదండ్రీ!” యంచుఁ బ్రార్థించినన్
గృపరాదయ్యె నదేమి మానసమొ; లే కేదే శిలాఖండమో! నా

ఇనుముఁ బాషాణమును వజ్రమును సమాన
రీతిఁ గరఁగఁగాఁ బోసి కంజాతభవుఁడు
తన మది సృజించెఁ గాఁబోలు, ధనదుఁ బోలు
కఠిన చిత్తుని నేను జగానఁ గాన. ౧౦

కనుగప్పి తన ధనాగారములో నున్న
    మించుభూషలు దొంగిలించు టెఱుఁగ,
గలనైన నన్యకాంతల బల్మిఁ జెఱఁబట్టి
    మానభంగము సేయఁ బూను టెఱుఁగ,
జెప్పిన పనియెల్లఁ జేసి తీరుటె కాని
    వాని మాటకు మాఱు వలుకు టెఱుఁగ,
ననుదినంబును గొల్వ నరుగుటయే కాని
    యొక పూటయిన మాని యుండు టెఱుఁగ,
నరగడియ జాల మొనరించి నంతమాత్ర
మున కె నాకిట్టి ఘోరదండన విధించె,
నిట్టి విపరీత ప్రభువుల నింత దనుక
కని విని యెఱుంగ నేఁ ద్రిలోకములలోన. ౧౧

అరగడియ జాగునకుఁ బె
క్కురగడియల శిక్షఁ జెప్పె నకటా! యెటు మ
త్తరుణీ వియోగభరమును
భరియింప గ్గలనో హృదయ భారము మీఱన్. ౧౨

తలనొప్పి వచ్చినట్టులు నుంత తెలిపిన
ధన్వంతరికిఁ ద్వాతముగఁ బిల్చుఁ;
దనువున నస్వస్థతగ నున్న దన్న దాఁ
బదము లొత్తును కరపల్లవములఁ;
నాఁకలి యగుచున్నదన్న వెంటనె రుచ్య
భక్ష్యంబులను దానె వండిపెట్టుఁ;
స్నాన మాడెద నన్న సంపెఁగ నూనెతోఁ
దలయంటి పన్నీట జలక మార్చుఁ;
నేను జెప్పకె తడవుగా నెట్టిదైనఁ
జలిపి తీరెడు క్షణమైన జాగులేక;
యట్టి యిల్లాలి నెడఁబాసి యెట్టులేను
మనఁగలాఁడను శాప సమాప్తివఱకు? ౧౩

కాననసీమనో మఱి యగాధ పయోనిధినో తలంచు మా
త్రాననె కామవిభ్రమము తగ్గునటంచు వచింతురు కాని, న
న్నానల పాలొనర్చిననుఁ గామవికారము తగ్గఁబోదు, మ
న్మానసరాజ్యలక్ష్మి వదనంబు కనుంగవఁ గట్టియుంట చేన్ ౧౪

ఎన్నఁడుఁ గన్నుఁ దమ్ములవహించి యెఱుంగను దుఃఖబాష్పముల్
మొన్నటిదాఁక నించితిఁ బ్రియోదరసాక్షులె కాని, శాపమున్
గన్న క్షణంబు నుండియు ననారత నిస్తుల శోకవారి నా
కన్నులఁ గార్చుచుంటిఁ జుమి కంటికి మంటికి నేకధారగా. ౧౫

వేటి కొరకప్పుడైన భువి నెందుట యుండునుగాని, నాదు క
న్నీటి కొకించు కంతయిన నిక్కముగా మఱి యెందుటన్న దే
నాఁటికి లేదు, జాహ్నవి యనారతముం బరమేశు శ్రీ జటా
జూటమునుండి పైకుబుకుచొప్పున నశ్రులు పొంగి పొర్లెడిన్.

"అలుకను దీర్ప నింత శ్రమ నందఁగ నేటికి? లెండు వేళకున్
గొలువున కేఁగకున్న యెడఁ గోపము జెందుఁ గుబేరుఁ"డంచు రా
గలగతి జ్యోత్స్నముం దెలుపు కైవడి భార్య వచించెఁగాని, యు
ప్పలుకు రుచింపనౌనె? యిటువంటి యవస్థనుఁ బొందఁ జెండగా.

"నమ్మిన బంటు నే నని మనమ్మున నుంత తలంపఁ బోక శా
పమ్మిడె నాకు నీమగఁడు, భర్త మనం బిఁక నెట్లు మార్చి పు
ణ్యమ్మును గట్టుకొందువొ కదా!" యని నాఁడె కుబేరుభార్య పా
దమ్ములు పట్టుకొన్న శ్రమ తప్పెడుఁగాని స్ఫురింప దత్తరిన్.

కోమలి మానసంబు సుమకోమల మేసుమ; స్వేచ్ఛమైన సత్
ప్రేమ మహాత్మ్యముం బొలఁతి కీర్తిగఁ బూనుషుఁ డేమెలుంగు నా
స్వామినిఁ గాపుమంచుఁ బలుమారులు వేఁడుటకంటె, వాని భా
మామణి నించుకంత బతిమాలియె యున్న వెతల్ ఘటిల్లునే?

కొలువును వీడి వచ్చుటొక కొంత విలంబన మయ్యెనేని చూ
పులు నిగిడించి, ఱెప్పలను మూయక నాకయి చూచుచుండుఁ గ
న్గొలఁకుల బాష్పబిందువులఁ గోటను జిమ్ముచు నా లతాంగి, యె
ట్టుల నిపు డోపుచున్నదొ కదుంగడు దీర్ఘ వియోగదీపికల్! ౨౦

"వెడలుచునుంటి నే ననుభవింపఁగ శాపఫలంబు తల్లి ! నీ
కొడుకునకున్ శుభంబు లొనఁగూడఁగ దీవనలిమ్మ" టంచు నే
నడుగులపైనివ్రాల, "తనయా! కడుపారఁగఁ గాంచినట్టి నా
యొడఁదను గత్తిఁగోఁత నిడు దే?" యని యేడ్చెను తల్లి గొల్లునన్.

ధీరోదాత్తుఁడు కాన నాజనకుఁ డుద్దీపించు ప్రేమమ్ముతో
నోరారంగ, "సుఖింపుమా"! యనుచు నేనున్ మ్రొక్క దీవించి వే
రారా! శాపసమాప్తినొంది సుకుమారా!" యటంచు వీడ్కొల్పె; నా
కారుణ్యాత్ముని పల్కు లెన్నడు వృథాకాఁబోవు ముమ్మాటికిన్.

వేఁగెద కాననస్థలికి; నేనొక యేఁడగుదాఁక క్రిమ్మఱన్
రాఁగలవాఁడఁ గా; నిఁక సరాగము మీఱఁగ ధీరచిత్తవై
సాఁగనంపు మ న్ననుచు సాధ్వినిఁ గోరఁగ, నన్ దటాలునన్
కౌఁగిటఁజేర్చి, యెంతవిడనాడు మటన్నను వీడఁగలైనే ? ౧౩

చానను బల్మిమై విడిచి శాపఫలంబును బొంద నక్కటా !
కానన సీమ కేఁ జరుగు కాలమునందుఁ దదేక దీక్షతో
మేను గవాటబంధమున మెల్లనఁజేర్చి లతాంగి నాదెసన్
గానఁదొడంగె, నేనుఁ దనకంటికిఁ గన్పడుదాఁక నచ్చోటన్ ౧౪

దవ్వగుచుంటి నన్న పరితాపము దుర్భరమాట, నిస్పృహాం
గెవ్వున కేకవైచి తన కేలుఁగవం గనుదోయిఁ గప్పి తా
నవ్వల మోముగాఁ దిరిగె, నక్కట! ప్రేయసి కేక నాచెవిన్
రివ్వున మ్రోఁగుచున్నది; భరింపఁ దరంబె తదీయ నాదమున్?

ఇంతిని వీడి పోవుతఱి నే కడసారి తదేక దృష్టితోఁ
గాంత మనోహరాకృతినిఁ గాంచుటచే నల దివ్యవిగ్రహం
బంతయు నచ్చు గ్రుద్దినటు హత్తుకొనెన్ హృదయాంతరాళమం
దెంత ప్రగాఢ మైనదో చుమీ, మమకారము ప్రాణికోటికిన్ !

నేరమును నే నొనర్చిన కారణమున
శిక్ష నాకు విధింపఁగాఁ జెల్లుగాని
నన్ను నాఁగ్రాటవులపాలొనర్చి, నాకు
భార్యకు వియోగ దుఃఖంబుఁ బఱపఁదగునె ? ౨౮

నాసతి దుఃఖమునుం గని మనంబునఁగుందుట కంటె "నాత్మజున్
దోసము సైఁపు"మంచు ధనదుం గని నాజనకుండు వేఁడుచో
నీసును మాని శాపమతఁ డించుక త్రిప్పఁగ వచ్చుఁగాని, వి
శ్వాస విహీన మానసులఁ బ్రార్థనజేయఁడు తండ్రియెన్నడున్.
తప్పొనరించి నందులకు దండన సేయుటొ? కొల్వునుండి న
న్నప్పుడె తీసివైచుటొ ? ధనాధిపు ధర్మము కాని న్యాయమున్
దప్పి ధనేశ్వరుం డనెడు దర్పము చేతను హద్దుమీఱి న
న్నిప్పగిదిన్ శపింపఁ దన కింతధికార మెవం డొసంగెనో! ౨౯

జీతము కోస మే నతని సేవలఁజేసితిఁ గాని వాని కే
రీతిని నాశరీరము ఖరీదున కమ్ముకొనంగ లేదె దు
ర్నీతిని బానిసీఁడుగ? గణింపఁగ నక్రమమైన శాప మి
ఖ్ఖ్యాతినొసంగ నెట్లతఁడు పాల్పడెనో కద చిత్రమయ్యెడిన్ !30

“సేవల నీవిధాన మనుచేసిన వారలు తే” రటంచు నె
న్నో విధులన్ సదా పొగడుచుండు కుబేరుఁడె నన్ను నన్యథా
భావన చేసి నోటి కెటువచ్చిన నట్టులు దూలనాడె; సే
వా విధులందు లోపములువచ్చిన సైఁపరె, యుత్తమప్రభుల్?

అరముడి దైవదత్తమగు హక్కనుచున్ నిఖిలాధికారముల్
నెరపి నిరంకుశత్వమున నెట్టన నేలు కుబేరుఁడౌర! నా
కరు నగు నన్ను బానిసనుగా గణియించి పరాభవించె, నీ
తర తమ భావ మెన్నఁడు యథార్థముగా నశియించిపోవునో!

శాప మొసంగు మేటి మునిసత్తములున్, బ్రథమాపరాధమున్
సైఁపఁగ భక్తివేఁడుకొను సాధు జనాళినిఁ దోసి పుచ్చరే
శాపము క్రిమ్మరింతు రను సంగతి మున్ ధనదుం డెఱింగి, యే
పాపములేని నాపయిఁ గృపన్ వహియింపఁడదేమి కోపమో!

కోపముచేఁ గుబేరుఁ డిది కూడునొ కూడదొ యను చు నెంచకే
శాప మొసంగెఁగాక! దివిషద్వరులెల్ల రెఱింగి కూడ నీ
కీపని కూడదంచు నొకఁడేనియు నాతనితోడఁ బోరి నా
యాపదఁబాపెనొక్కొ! దివియందున ధర్మము మాసిపోయెనే?

సతి నెడఁబాయఁ జాలక యె సామెయిఁబార్వతిన్ వహించి, సం
తత సుఖలీలలం దనరు దైవమ వయ్యు, ధనేశ్వరుండు మ
త్సతి నెడఁ బాయ శాపము నొసంగిన తోడనె చక్కఁజేయకే
యితరుల మాడ్కి మానము వహించితి వేటికి? చండికేశ్వరా!

నిరుపమ సాధుశీలుల ననేక విధమ్ముల బాధపెట్టఁగా
దొరకొను టేటిన్యాయమొకొ! ఓ యజనాథ! సతీప్రియుండవున్
బరమ దయామయుండ వని ప్రస్తుతి కెక్కిన నీవె యీగతిన్
జరుపుచు నుండఁగాఁ బరులు సల్పుటలో విపరీత మింకనే?

సీతను రావణుం డెడము సేయఁగ, స్వీయ సతీ వియోగ దుః
ఖాతి శయాన బెక్కు వెతలొందిన స్వానుభవుండవయ్యు, మ
న్నాతిని బాసి ఘోరవిపినంబున శోషిలుచున్న నన్ను నీ
రీతిని నిర్దయామతిని శ్రీరఘురామ! కనంగఁబాడియే? ౩౮

పరమాత్మం బరిపూర్ణ భక్తిని సదా ప్రార్థించు నా భక్తశే
ఖరునే వేయువిధాలఁ గష్టముల పాల్గావించి శోధించుచున్
బరిపాలించుట దేవదేవుని స్వభావంబయ్యె, నా "దేవునై,
గురునై" యుంచఁ జరించునాస్తికులకెగ్గుల్ గూర్పఁడొక్కప్పుడున్

అగ్రిమమైన శాపము ధనాధిపుఁ డిచ్చెనుగాని, యద్ది ని
ర్వక్రగతిన్ ఫలించుటనుబట్టి యథార్థము నెంచి చూడఁగాఁ
జక్రధరుండుఁ గూడ ననిశమ్ము ధనేశుల పక్షపాతియై
వక్రమతిన్ బ్రపంచ పరిపాలన చేసెడినంచుఁ దోఁచెడున్.

అనుదిన మా మహేశుని సమర్చన చేసెడు వేళ లందునన్
మనసున నన్ను నిల్పి, పరమాత్ముని తోడ సమానరీతిగా
ననుఁదన నెమ్మనమ్మున ఘనమ్ముగఁ గొల్చుచునున్న పుణ్యసా
ధ్విని విడనాడు నంతటి యదృష్టవిహీనుఁడ నెట్లునే? ౪౦

నా కమలాయతాక్షికిని నాకు వియోగము నెట్లొనర్చెనో
యాకరణిం గుబేరునకు నాతని భార్య కజుం డొనర్చుచో,
వాకొనరాని నాదు దురవస్థ రవంత గ్రహింపఁ గల్గు; తన్
దాఁకఁగ వచ్చినప్పుడె కదా, తగవుల్ తెగు నెంతవానికిన్ ?

“పెట్టితివీవె నాకు సతిభిక్షను నయ్యది రట్టుసేయ నీ
కెట్టులు బుద్ధిపుట్టె; నగరే, సరివా”రన, నన్నుఁగట్టిగాఁ
దిట్టుచు నెట్టకేలకు, సతీపతులన్ విడఁగొట్టు పాప మె
ప్పట్టుననైన నాధనదుఁ బట్టి వినాశ మొనర్పకుండునే ? ౪౨

మత్తత కన్నుఁ గప్ప దయమాలి కుబేరుఁడు నాలతాంగితో
బొత్తెడఁ బాపి నన్ను వనభూమిఁ గృశింప శపించుకంటె,బల్
కత్తినిఁ జేతఁ బూని, యనుకంపను మాని, కటుక్కుమంచు నా
కుత్తుక నుత్తరించి తన కోపముఁ బాపుకొనంగ రాదొకో! ౪౩

స్వర్గమందు నాదర్శ దంపతులవోలెఁ
బ్రేమ తళుకొత్త మేము జీవించు టరసి,
యోర్వలేక ధనేశుఁ డేదో నెపమున
వేరుచేసెను తన కసిఁదీర మమ్ము. ౪౪

కాయములురెండె యైనను గాని, యాత్మ
లొకటె నాకును నాసతి కకట ! మాదు
కాయములు వేరుసేయఁగాఁ గలిగెఁ గాని
యాత్మలెడబాప ధనదున కలవి యగునె ? ౪౫

చందురునుండి చంద్రికను, సంపెఁగనుండి పరిమళంబు, నే
చందము వేరుసేయఁగ నసాధ్యము ! యాగతి “ నిన్ను నన్ను నీ
బొందెలలోన జీవములఁ బూనిన యంతకు వేఱుగా శతా
నందుఁడు సేయలేఁ” డనుచు నాసతి పల్కినదెంత బేలయో!

సంతతిఁ గల్గి యున్నయెడ సారెకు బిడ్డలఁ జూచుకొంచు, ని
శ్చింతగ రోజులం గడపఁ జేడెకు సాధ్యముకాని, యింట నే
కాంతముగా వసించుచును, గాలము బుచ్చుటెకష్టమాటచేఁ
జింతిలుకంటె మోదమెటుచెందఁగ సాధ్యమొకప్పుడేనియున్?

నీడ విధాన నేను గృహిణీ సముఖమ్మున నున్నవేళలన్
వేఁడి వెలుంగుఁ గ్గానిన నీరజమట్లె వికాసమందుఁ బూ
బోఁడి మొగంబు, నే నవలఁబోవ, నిశీధిని వారిజంబటుల్
వాడఁదొడంగు నాపెముఖపద్మము;నాపయి నెంతప్రేమయో!

కటకట! యెంత దుర్విధియొ కాక సతిన్ విడనాడనౌనె? యా
కుటిల కటాక్ష వీక్షణలు, గోమల రమ్య కపోలకాంతు, లా
చటుల విభాసిత భ్రుకుటి చాలనవైఖరిఁ, గాంచు భాగ్య మె
న్నటికి లభించు నోకద మనం బలరారఁగ మాటిమాటికిన్.?

అందములోన నాచెలియ కా చెలి సాటి; లతాంగులందుఁ గ
న్గొంద మటన్న నాపె కొనగోటి కొకర్తెయు నీడురాదు, స్త్రీ
సుందర రూప మీ జగతిఁ జూపఁగ మెచ్చునకున్ విరించి యా
చందమునన్ సృజించినటు చూనవెలుంగు మనోహరాకృతిన్.

నీల నీరదము కాన్పించి నంత నెలంత
 వేణీభరంబు జ్ఞప్తికిని వచ్చుఁ;
బూర్ణ సుధాంశుఁడు పొడ చూపి నప్పుడు
 కలికి చక్కని మోము కంటఁగట్టు;
వనరుహంబులు నీటిపైఁ దేలియాడఁగ
 కోమలి కండోయి గోచరించు;
జక్కవ పిట్టల జంట కంటను బడ
 పెలఁది వక్షోజముల్ స్ఫురణకువచ్చుఁ;

బ్రకృతి నే రమ్య తమ పదార్థమును గనిన
సుదతి యవయవంబు విధాన మదికిఁ దోఁచు
నెంత మఱపును బూని చరింతు నన్నఁ
గాంత రూపంబె యెపుడు సాక్షాత్కరించు. ౨౧

నడచెనా, వంద పున్నమ చందమామల
 కాంతి పుంజము దిశల్ గ్రమ్ముకొనును;
యాలోకన మొనర్చెనా, వేయి మదన సా
 యకము లిమ్మెయి నాటి నట్టులగును;
నాట్యంబు నొనరించెనా, లక్ష శారదల్
 నృత్యం బొనర్చిన రీతిఁ దోఁచు;
యాలాపన మొనర్చెనా, కోటి కిన్నెర
 లొకసారి మీటిన ట్లొలయుచుండు;

హాస మొనరించెనా కొక్క కందరాని
మల్లెమొగ్గలు విచ్చిన మాడ్కి మెరయు;
నావిశాలాక్షి రూపరేఖావిలాస
ములను వర్ణింప వలువకు వలవి కాదు. గీ.౨

చిక్కెరబొమ్మ చందమున చాన తయారయి పవ్వళింప నే
పక్కను జేరి సంతటనె వచ్చి ముదంబున నా పదంబులన్
జక్కఁగ నొత్తుచున్ మరులుకొసంగఁ బ్రసంగ మొనర్చి ప్రేమత
త్పొత్తఁజరించు రోజు లొనఁగూడునొ కూడవొ యింక మీఁదటన్

అర నిముసంబు తీఱికగు నంతనె భార్యను బిల్చి తృప్తిచే
కుర దనమోవి తేనియల గ్రోలుచు వేమరు గాఁగిలించుచున్
బరవశ మొందఁగా వివిధభంగుల సౌఖ్యరసాబ్ధి వీచి కాం
తరముల నోలలార్చితిని, దద్విధ మిప్పుడు భాగ్యమబ్బునే? ఉ.౩

పున్నమ నాఁటి రేలఁ బరిపూర్ణ ముదమ్ముననఁ బూలతోఁటలో
నున్నత రమ్య హర్మ్యమున నుంచి లతాంగిని మోహ వార్ధి నె
న్నన్నొ విధాలఁ దేల్చి సుఖయింపఁగఁ జేసితి; నిప్పుడా శశిన్
గన్నపుడెల్ల నా చెలియ కాంచెడు వంతకు నంత మున్నదే?

"ఎప్పుడు పూర్ణచంద్రుఁ డుదయించునొ? యెప్పుడు నిండు వెన్నెలం
దొప్పులకుప్పఁ గూడి ముద మొందుదునో?" యని వేచియుండు నా
కిప్పుడు నిండు వెన్నెల దహించుచు నుండిన మండు వేసవిన్
నిప్పులు గుప్పుచున్నటులు నెమ్మదికిం గనుపట్టుచుండెడిన్ ఉ.౪

ఉరు సుఖజీవనం బమరి యుండిన నన్నిటు ఘోరకాననాం
తరముల కంపుటల్ గన, ఘనమ్ముగ వెల్గెడి వెల్గునుండి దు
స్తర తమసమ్ముఁ జేర్చిన విధమ్మున, స్వర్గమునుండి బల్మిమై
నరకములోనఁ ద్రోసినటు నాకనిపించు నిదేమి చోద్యమో !

తత హంసతూలికా తల్పంబు వోనాడి
బండరాలనుఁ బండ వలసివచ్చె;
పంచభక్ష్య రుచిర పరమాన్నములు మాని
వాయు భక్షణ సేయవలసివచ్చె;
మృదుతర రమ్య పట్టదుకూలములు వీడి
పాఁతగుడ్డలు కట్ట వలసివచ్చె;
మహనీయ భర్మ హర్మ్యమ్ములు విడనాడి
వనవాటి నివసింప వలసివచ్చె;
దాసదాసీ జనమ్ములఁ బాసి, ఘోర
వన్యమృగములతో నుండ వలసివచ్చె;
పూర్వభవ పాపఫలమిట్లు పొందవలసె;
విధి విధానంబు నెవరు తప్పింపఁ గలరు ? ౧౮

ప్రేయసి దివ్యమంగళ సువిగ్రహరాజము నా శరీరమున్
గోయుగ వచ్చు రక్తమున గొట్టుకొలందిగ నెండుటాకులన్
వ్రాయుచు వచ్చుచుండిన రవంతయుఁ దృప్తి జనింపదాయె;నా
కా యెలనాగ మోముఁ గనులారఁ గనుంగొను భాగ్యమెన్నఁడో?

వ్రాసిన మూర్తులెల్ల నలుఁబ్రక్కలఁ బేర్చితి నెందుఁబోయినన్
నాసతి ముద్దుమోము నయనమ్ములకుం గనుపించు నన్న య
య్యాసను జేసి, వర్ణ మకటా! చెలి రూపును మాపి వైచి నా
యాస నిరాశ జేసెఁ; బరమాత్మునకుం బగవాఁడ నైతినే? ౬౦

జ్ఞానము గల్గినట్టి నిముసంబున నుండి యథోచితంబుగా
దానము ధర్మముల్ పలువిధమ్ము లొనర్చితిఁగాని, యేరికిన్
హాని యొనర్చి నే నెఱుఁగ నక్కట! యేలొకో నన్ను నీగతిన్
గానల పాలొనర్చి కడగండ్లను గూర్చితి వయ్య దయ్యమా!

తను వెపుడెప్పుడైన స్వప్నమాఁ దప్పి కనుంగవ మూఁతవడ్డ వెం
టనె, ప్రియురాలు చెంతకుఁ దటాలున వచ్చి, విషాదపూరితా
ననయయి, "యో మనోహరుఁడ! నావలనం గదయింత వచ్చె నీ"
కని వగపోయుచుం బలుకు నట్టిదనుంగని జాలిచూపులన్ ౬౨

కలలోనన్ హృదయేశ్వరీ ప్రతిమ నేఁ గన్నార వీక్షించి, సం
చలచిత్తంబున నాపె యంసయుగమున్ హస్తద్వయింబట్టి, బా
హులతావేష్టన మాచరించునటులై యొప్పారుటం జేసి, క
న్నుల నొక్కించుక విప్పి సిగ్గిలితి భ్రమానుంగాంచి నాకౌఁగిటన్.

మంచముఁబట్టి తిండియను మాటయెఱుంగక, చిక్కిశల్యమై
పంచశరాగ్నికీలలకు భస్మముగా గుటికైన యట్లు కా
న్పించెను స్వప్నమందు చెలి నిన్నటిరాతిరి, నింక నాపె జీ
వించునొ లేదొ! నాహృదయవేదన తీర్చెడు వారలెవ్వరో!

ఇంతటి ఘోరకృత్యమున కెన్నఁడుఁ బాల్పడఁబోము, నేను శా
పాంతము కాఁగ వచ్చెద నటంచుఁ బ్రమాణముచేసి పల్కుటన్
జింతను మాని నా కొఱకుఁ జేతను ప్రాణముఁబట్టి, ధీరతా
స్వాంతముతోడ జీవితము సల్పెదు సందియమంద నేటికిన్ ?

"ఏటికి నీమనోహరున కింతటి శాపము సంఘటిల్లె నో
బోటి! వచింపఁగావలయు బూపమ్రగ్చినమాడ్కి మాకు మో
మోటము మాని నీ వ"నుచు ముద్దియ లామెను గోర, నెట్లు బా
హాటముగా వచింపఁ గల దక్కట! కారణమున్నరీతిగా? ౬౬

కారణముఁ జెప్పెదో విన్నవార లార !
కాముకులకెల్లఁ దగినట్లె కఠినశాప
మిచ్చె నా కుబేరుఁ డటంచు నెంచుకొనరె ?
యెంత తలవంపు ఘటియించె నీశ్వరుండు ? ౬౭

ఈశునిఁగూర్చి యెందఱో మునీశులు ఘోర తపంబొనర్చి స
ర్వేశు కృపాకటాక్షమున నెన్నియొ కాములఁ బాసిరన్న య
య్యాశను జేసి వారివలె ధ్యానమొనర్చితిఁగాని, మోహ సం
పాశ విబద్ధ సంచలిత భావుఁడ నౌట, ఫలింప దయ్యెడిన్ ౬౮

స్థిరమతి లేక మోహజలధింబడి యిట్టటుకొట్టుకొంచు నీ
వఱకు నమూల్య కాలమును వ్యర్థ మొనర్చితిఁగాని, యీపరా
త్పరుని పదారవిందములె ధ్యానమొనర్చుచు నిశ్చలాత్మతోఁ
బఱఁగిన జన్మజన్మముల స్వర్గసుఖం బొనఁగూడ కుండునే? ౬౯

ఉల్లసమారఁగా లతల నూయెల లూఁగుచు కోయిల మీఁటఁగాఁ
జల్లని పిల్ల తెమ్మెరల చాఁదున సారెకుఁ గ్రీడలాడఁగాఁ
జిల్లెడు పక్షి దంపతుల నిత్యము నేఁ గనుఁగొంచు నక్కటా!
యుల్లము నందు నెట్లు మఱపొందఁ దరంబగు నాతలోదరిన్ ?

పక్షిసంతతి కున్నంత పఱకునైన
స్వేచ్ఛ లేదయ్యె మామక జీవితమున
కకట! యిటువంటి పాడు పుట్టుకను బుట్టి
బ్రతుకు కంటె చచ్చుటె మేలు బల్మిమీఱ. ౨౧

సరసిని హంస దంపతులు సారెకు ముద్దులు వెట్టుచుంట నే
నరసిన వేళలందుఁ బ్రియమారఁ దటాకములోన, నేను నా
తరుణినిఁ గూడి యీఁదుచు ముదంబును బొందినయట్టి దృశ్యముల్
స్మరణకు వచ్చి నెమ్మనము సంచలితమ్మొనరించుచుండెడిన్.

మల్లె గులాబి సంపెఁగ సుమంబుల నుండి మనోహరంబుగాఁ
జల్లెడు సౌరభం బెడఁ బ్రశాంతినిఁ గూర్పఁగఁ బూలతోఁటలో
సల్లలితానురాగమునఁ జానయు నేనుఁ జరించి మించి, రం
జిల్లెడు నాళు లెంచుచుఁ గృశింపఁ దొడంగితి నాఁటి నాఁటికిన్.

ఘనసుంద రోద్యాన వనమునఁ దనరారు
పూవుఁ దీవెలు వాడిపోయె నేమొ!
పల్కు పల్కునఁ దేనెలొల్కఁ గుల్కుచుఁ బల్కు
చిల్కదంపతులు కృశించె నేమొ!
యారోహణ మొనర్చి నంత రివ్వునఁ బాఱు
వారువంబులు వసివాడె నేమొ!
కోరిన దుగ్ధముల్ కుంభవృష్టిగఁ గురి
యించు గోమాత క్షీణించె నేమొ!

యగ్గలకు మగ్గలొత్తు చెల్లపుడు సేవ
చేయు దాసీజనము వాసిపోయె నేమొ!
తెలియరాదయ్యె; నిట నిజస్థితి వచించు
వారలుందురె? నా వెఱ్ఱి భ్రాంతిగాక! ౭౪

కోయిల గున్నమావి కొనకొమ్మ వసించి, చిగుళ్ళు మేయుచున్
హాయి మెయిన్ గుహూకుహూ యటంచును గూయుచు నాదుజీవము
ల్దీయుచు నుండు; నెంత ఘుదలించినఁగాని మదించి కొమ్మలన్
బాయదు; మామకాజ్ఞ యనఁ బక్షికి సైతముఁ జుల్కనయ్యెఁగా?

ఈపరితాప భారము నొకించుక యేని భరింపలేక నా
కోపము దీర కోలఁగొని కోయిల ప్రాణము దీయఁ బూనియున్
బాప మటంచు మానితిని, బల్మి మొయిం దన పెంటికూడ సం
తాపముచే మృతింగనినఁ దత్ఫలితంబును బొందనౌఁగదా? ౭౫

కాముఁడు కూ్రరుఁడన్న నుడికార మబద్ధము కాదు; నిచ్చలున్
ప్రేమరసైక మానసులఁ బెట్టెడు బాధలఁగాంచి సత్కృపా
ధాముఁడు శంకరుం డతని దగ్ధమొనర్చియుఁ దత్సతీమణీ
క్షేమము నెంచి యాతని సజీవునిఁ జేయుట ముప్పువాటిలెన్.

రూపము గల్గియున్న కలరూపముగాంచి మనోజుఁడంచు సం
తాపము కొంతఁబాపుకొనఁ దావొదవుంగద? వానిరూపమున్
మాపుటచేఁ బురాంతకుఁడు, నా కనులం బడకుండ రేబవల్
తూపులునాటి నాయెడఁదఁదూట్లు పడంగనొనర్చుచుండెడిన్.

అనితరసాధ్య కష్టనిచయంబు లెసంగెడు కాలమాటచేఁ
గనఁబడుచున్నదెన్నియొ యుగంబుల కైవడి వత్సరంబిటన్
ఘనతర సౌఖ్యసంపదలఁ గాంచెడు కాలమెయైన, వర్షమే
దినమయి తోఁచు; కారణము దీనికి దుర్బలచిత్తమే కదా? ౭౯

ఎంతప్రియత్నమున్ సలిపి యే నిదురింతు నటన్నఁ గంటికొ
ంతయుఁ గూర్కుపట్ట, దెదియేనియుఁ దృప్తిగఁ బొట్టనిండభ
క్షింతు నటన్న నోటికి రుచింపదు, నీరముఁ గ్రోల లోనికిన్
సుంతయుఁబోవ, దెట్లునిలుచున్ మెయి జీవములింక మీఁదటన్.

ఎండ కే నెండి వాన కెంతేని తడిసి
చలికి గడగడ వడఁకి నిచ్చలు భరింప
రాని కడగండ్లు వడసితిఁ గాని సుంత
సౌఖ్యమెఱుఁగను గలలోన సైత మకట! ౮౧

పాకములలోన లోప మేపాటియున్న
భోజనము మాని యలుకీడి పోవుచుందు
నన్నపానంబులను గాఁ దన్నుకతన
దూరమైతిని తిండి కీతీఱుగాను. ౮౨

లేచినవేళ యెట్టిదియొ! లేక మఱెవ్వరి పాడుమోము నేఁ
జూచితినో! దశాధిపతి చూడ స్వభుక్తినిఁ బొందెనో! మఱే
నీచులతోడఁ గూడితినొ! గణింపఁగ నద్దశ ఛిద్రమయ్యెనో!
తోఁచుటలేదె యీగతిని దుర్గతిఁ బట్టుట కేమి హేతువో! ౮౩

ఎట్టిముహూర్తమందు ఘటియించిరొ పెండ్లిమాకు? తాళి నేఁ
గట్టిన మూడు నాళులకె కట్టా! వియోగము సంభవించె; నా
కట్టిడి బ్రహ్మ యిట్లు కడగండ్లను గూడఁగ నానొసళ్లపై
నెట్టన వ్రాసెనేమొ? విధి నిర్ణయమున్ జవదాఁటు శక్యమే?

యోగము బాగులేని తఱి నున్నత పన్నగరాజమైన నే
లాగున చిన్న చీమల బలానికి లోఁబడునో, యటే వెతల్
రాఁగ మహాత్ముఁడైన నవురా, కడునల్పులచేతఁ జిక్కుఁ; గ
ర్మాగత పాపపున్ ఫలిత మందక తప్పునె యెంతవారికిన్? ౮౫

శాప మతిక్రమింపఁగ నశక్తుఁడనౌట వియోగభార చిం
తాపరిపంథి బంధిత మనస్కుఁడనైతిని; లేకయున్న భా
ర్యాపరిరంభణంబు బిగియాఱ నొనర్పఁగ ఱెక్కలూని తా
రాపథమందుఁ బాఱుచును వ్రాలనె నాప్రియురాలి చెంగటన్?

బ్రతికిన యంత దాఁక మగవారలు "నాసతి నాకుమారు"లం
చతి మమతన్ మతిం దలంతు రక్కట! ప్రాణము వోయినంతనే
సతిని సుతాళులం దెలియఁజాలరు; సర్వము మిథ్య కాన, నే
బ్రతుకుటకంటె చచ్చుటె యవశ్యసమాచరణీయ మీ యెడన్.

పాపములలోన నాత్మహత్యాపరాధ
మధిక మంచు వచించెద రఖిల విబుధు,
లధమ జీవితమున వ్యథ లనుభవించు
కంటె నీ పాప మధికంబు కాదునాకు. ౮౮

బలిమిమీఁ బ్రాణముల్ విడువఁబల్కరు నేనిచటం బ్రయత్నముల్
సలిపితిఁగాని పూర్తి విఫలత్వముగల్గెను; దీనిఁజూడ, నా
కులసతిఁగూడ భాగ్యమొనగూడ నటన్న తలంపు నెమ్మదిన్
గలుగుచునుండు, నింతకును కర్మఫలంబెయి యున్న శోకదారనా
పవలున్ రేలును పుత్రసంతతికినై పల్మారు చింతించి, మా
ధవు కారుణ్యమునన్ ననుంబడసి, విద్యాబుద్ధులన్ నేర్పి, గా
రవమొప్పారఁగఁబెంచు నాజనని పుత్రప్రేమయే నిచ్చలున్
గవచంబై ననుఁగాచుచున్నదిక దా కాంతారవాసంబునన్ నం
మొంచి తనాన జీవితము బుచ్చితి నెన్మిది మాసముల్ మహో
ద్దండ భయంకరాటవిని దాతయు దైవము లేక, యక్కటా!
పండిన పొట్లపండువలె వర్ష్మ మిటుల్ క్షణభంగురంబుగా
నుండెడుఁ బ్రాణమెట్టులిఁక నుండునొ రాఁగల నాల్గుమాసముల్

సర్వజనులు సత్కర్మ దుష్కర్మ ఫలము
లనుభవింపకఁ దప్ప దటంచు సకల
శాస్త్రములు ఘోషిలుచె కాని, సత్య మింత
పఱకుఁ దెలిసిన వార లెవ్వరును లేరు. గీ 2

గత విశేషంబు లొక్కటొక్కటి మదీయ
భావ వీథిఁ బ్రవేశించి బాధ గదుర
కట్ట తెగిన తటాకోదకంబు కరణి
బాష్పవారి ప్రవాహమై పాఱఁదొడఁగె. గీ 3

రాతిరియుం బవల్ విధివిరామము లేక రథాలు కైవడిన్
నాతలలోన భీషణ నినాదపరంపర లుప్పతిల్ల వే
రీతుల నేవొ పర్వెచు, భరింపఁగరాని దురంత వేదనో
ద్ధాత మనస్కఁ జేసి ధృతిఁదూల్చుచునుండు నదేమి హేతువో?
"శాంతముఁబొందుమా! యిటువిచారమునొందఫలంబు లేదు శా
పాంతము కాఁగ నీ వసరుహాక్షినిఁ గూడెదు భాగ్యమబ్బు; నీ
చింతలు కాపురం బెపుడుఁ జేయవు; ధైర్యమవశ్య"మంచు, వే
కాంతులతో వెలుంగు వన కాంతి వచించెను నవ్వుడప్పుడున్.

మనసును బట్టలేక పలుమాఱు లొనర్చెదు నా యరణ్యరో
దనమును విన్నవారెవరు? ధాత్రియొ! లేక ధరాధరంబొ! జీ
వనద మొ! కాని బంధువులు వత్తురె? యింతకు నా లలాటరే
ఖన మెటులున్నదో, యటులె కాక మఱొందు విధంబుకల్గునే?

నవ వధూవియోగ భర దందహ్యమాన
మానసుండ నాట మేను క్రమక్రమమ్ము
చిక్కి శల్యావశిష్టమై స్రుక్క కతన
స్వర్ణమయ కంకణము చేయి జాఱి పడియె. ౯౭

చెలియ కే నెట్టు లున్నానొ తెలియకునికి
నెంత వగఁజెందుచుం గృశియించునొ కద?
ధైర్యము వహింపు మని నీరదమ్ము చేత
రాయబారము నంపెద రమణి కడకు. ౯౮

కవితఁ, గానముఁ, జిత్రలేఖన మొకింత
బాల్య మాదిగ నేర్చిన వాఁడ నగుట,
నెలఁత గుణ రూపములను వర్ణించు కొనుచుఁ,
బాడుకొనుచు, లిఖించుచుఁ బ్రతుక వలసె. ౯౯

ఓ వనమాలి! మాంమక వియోగ భరంబునుదీర్చి, వేగ నా
దేవినిఁగూడి కుల్కెడు యదృష్టముఁగూర్చిన, బాష్పధారలన్
దావక పాదముల్ కడిగి, తారలె పూవులుగాగ మేఘమా
లావృత నిర్మలోదకము లర్ఘ్యముగాఁగ నొనర్చికొల్చెదన్. ౧౦౦



కాకినాడ ముద్రాక్షరశాల కాకినాడ ఇ. జి. 19—500.

## ప్రేమతో విరాళము లొసంగిన ప్రియమిత్రులు.

శ్రీ కల్యాణం రామమూర్తిగారు.

శ్రీ ర్యాలి నాయునగారు.

శ్రీ డొంక కన్నాచారిగారు.

శ్రీ లక్కోజు కనకరత్నంగారు.

శ్రీ కొల్లేపర సుబ్బారావుగారు.

శ్రీ నాగుమల్లి రాజారావుగారు.

శ్రీ ఆకోజు వరప్రసాదరావుగారు.

శ్రీ లంక నూకరాజుగారు.

శ్రీ వీరమళ్ళ వెంకటరత్నంగారు.

శ్రీ నామగిరి వీరభద్రస్వామిగారు.

